

అంతర్జాతీయ తొలిమహిళా పంచాంగకర్త
శ్రీమతి పళ్ళావఝుల వేంకటసత్య లలితాఫణిలక్ష్మి (లలిత)
తాడేపల్లిగూడెం

# లాస్‌ఏంజల్స్ - శాన్‌ఫ్రాన్సిస్కో
# శ్రీ దుర్ముఖి నామ సంవత్సర
# 2016-17 పంచాంగము

mohan PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
www.mohanpublications.com
Mohan Publications
Buy the E-Books in
Kinige.com
MOHAN PUBLICATIONS
ANDROID APP ON
Google play
Mohan Publications
Like us to Follow
facebook

ఓమ్ శ్రీగణేశాయ నమః

లాస్ ఏంజెల్స్

శాన్‌ఫ్రాన్సిస్

# వాస్తవ దృక్సిద్ధ

# స్వస్తిశ్రీ దుర్ముఖి నామ సంవత్సర పంచాంగము





పంచాంగకర్త

అంతర్జాతీయ తొలి మహిళా పంచాంగకర్త

## పళ్ళావఝ్ఝల వేంకటసత్యలలితాఫణిలక్ష్మీ(లలిత)

తాడేపల్లిగూడెం - 534 101, ప.గో.జిల్లా, ఆం.ప్ర, భారత్

సెల్: 98492 52017

vastuvidyavigjnanakendram@gmail.com, vvvk711@gmail.com, FaceBook : psrkrishna

కలియుగం

5118

ప్రకాశకులు

## మోహన్ పబ్లికేషన్స్

రాజమండ్రి

వ్యావహారికం

2016- 2017

# విజ్ఞాపన

వాస్తవ దృక్సిద్ధ పంచాంగము లాస్ ఏంజల్స్ - శాన్‌ఫ్రాన్సిస్ పట్టణములకు గణితము చేయబడినది. ఈ రెండు దగ్గర ప్రాంతాల వారు యధాతథముగా వాడుకోవచ్చు. ఇందులో తిథి, నక్షత్ర, యోగ, కరణాలు అంత్య సమయము, వర్జ్యం, అమృతం, దుర్ముహూర్తం, రాహుకాలం, యమగండం, గుళిక సమయాలు, అలానే లగ్నాలు ఆరంభము - అంత్య సమయాలు చూపబడినవి. సూర్యోదయ, అస్తమయాలు ఇవ్వబడినవి. చంద్రుడిని రాశులలో చూపలేదు. ప్రయాణాలకు అనువుగా ఆనందాది యోగములు రోజూ సూచించడమైనది. తారాబలము తెలుసుకొనుటకు వీలుగా ప్రతీ రోజూ ఉండే నక్షత్రమునకు ఇవ్వబడినవి.

ముఖ్యంగా ముహూర్తాల విషయంలో జాగ్రత్తను వహించి కేవలం మంచి ముహూర్తములను మాత్రమే ఇవ్వబడినవి. ఏ మాత్రం దోషమున్ననూ ఆ యా ముహూర్తములు విడువబడినవి. ఇందలి ముహూర్తములు తారాబలము, రహితముతో సంబంధము లేకుండా వాడుకోవచ్చును.

ఇంకనూ అనేక సందేహములకు, ముహూర్తములకు మమల్ని సంప్రదించవచ్చును.

అమెరికాలో ఉన్న తెలుగువారి కోసం ముహూర్తాలతో సహితంగా సంపూర్ణముగా చేయబడిన ఈ పంచాంగము పి.డి.ఎఫ్ రూపంలో మోహన్ పబ్లికేషన్ వారి వెబ్ సైటు మరియు కినిగె డాట్ కామ్ వారి ద్వారా అందిస్తున్నాము. పాఠకులు మీ అభిప్రాయాలను తెలుపగలరు.

## సంవత్సరాది నాడు ఏమి చేయాలి

తెల్లవారుఝామునే లేచి కాలకృత్యములు తీర్చుకోవాలి, స్నానం,నిత్యపూజలు పూర్తి చేసుకోవాలి. నిత్యపూజలోనే క్రొత్త వస్తువులను,ఆభరణములను పెట్టి పూజించాలి. తదుపరి ధారణ పూర్తిచేసుకుని, విఘ్నేశ్వరుని,సరస్వతిని,లక్ష్మీని,క్రొత్త పంచాంగాలను, బ్రాహ్మణులను అనగా ఇంటి పురోహితులను, గురువులను అనగా మన ఇంటికి మంచి (ముహూర్తములను, జాతక ములను చూచేవారు) చేయు వారిని పూజించాలి.

షడ్రుచుల (చేదు,పులుపు,తీపి,వగరు,కారం,ఉప్పు) ఉగాది పచ్చడిని తినవలెను. ఉత్తములచే పంచాంగపఠనము చేయించుకుని, శ్రద్ధతో వినవలెను. బంధుమిత్రులతో ఆనందముగా ఉండవలెను. ప్రతీ ఇంటిపై కాషాయజెండాను ఎగురవేయవలెను. ఇలా చేస్తే ఆ యింట సంవత్సరమంతా లక్ష్మీ అనుగ్రహంచే సర్వసంపదలు కలుగుతాయి.

ఇక్కడో చిన్న విషయం చెప్పాలి ఇంటి (యజమానుల శ్రేయస్సుకోరువారే నిజమైన పురోహితులు అనగా చెడ్డ ముహూర్తములు పెట్టనివారు.) పురోహితులకు, ఇంటి గురువులకు పూజించి తరువాత బాబాలను పూజించాలి. ఇంటి పురోహితులు కాని, ఇంటి గురువులు కాని ఏదైనా మంచి చేస్తున్నప్పుడు వారికి ఆర్థిక, హార్ధిక సహాయం చేయాలి.

## పంచాంగం వినడం వలన ఎట్టి ఫలము కలుగును ?

**పంచాంగము పఠనము వినినందువలన**

తిథేశ్చ శ్రియమాప్నోతి - తిథి వలన లక్ష్మీ అనుగ్రహం
వారాదాయుష్య వర్ధనం - వారం వలన ఆయుష్షు
నక్షత్రాత్ హరతే పాపం - నక్షత్రం వలన పాపశాంతి
యోగాత్ రోగ నివారణం -యోగం వలన రోగ నివారణ
కరణాత్ కార్య సిద్ధిస్తు - కరణం వలన కార్యసిద్ధి
కలుగుతుందని మన పెద్దల వచనం.

తిథి అంటే రోజు, వారము అంటే తిరిగి మరలా వచ్చేది అని అర్థం, నక్షత్రము అంటే నాశనము లేనిది అని అర్థం, యోగము అంటే కలిసి వచ్చేది అని,కరణము అంటే పని అర్థం, ఏదైనాపని చేయాలంటే రోజు, వారం, నక్షత్రం, యోగం, కరణం మంచివి అయినప్పుడే మనం చేసే పని సుఖవంతము అవుతుంది.

రోజు,వారం,నక్షత్రం,యోగం,కరణం మంచివికానప్పుడు ఆ పని దుఃఖ వంతము అవుతుంది. సారాంశమేమనగా పని యొక్క ఫలితమును నిర్ధుష్టముగా తెలిపేది పంచాంగము. అంటే మనం చేసిన మంచి పని మరలా చేసేట్టుండాలని పెద్దల అభిప్రాయం కాబోలు.

ఉదా : మంచి సమయంలో వివాహం చేస్తే యోగ్యమైన సంతానం ద్వారా వంశము,సమాజం ఉద్ధరించబడతాయి. ఉపనయనం చేస్తే జ్ఞానం కలుగుతుంది. ఇలా ప్రతి ముహూర్తము పంచాంగాన్ని అనుసరించి సరిగా నిర్వహిస్తే మంచి ఫలితము కలుగుతుంది. అదే పంచాంగ ప్రయోజనము. -పంచాంగకర్తలు

## విషయ సూచిక



ఈ పంచాంగములో ఉండే ప్రతీ విషయము నకు పంచాంగకర్త పళ్ళావఝుల వేంకటసత్యలలితాఫణిలక్ష్మీ(లలిత) గారు సమాధానము ఇస్తారు.

ఇండియాలోని సమయము ప్రకారం సాయంత్రము 4.00 నుండి రాత్రి 9.00 గంటల వరకు సంప్రదించవచ్చును.

## లాస్ ఏంజల్స్‌కు లగ్న ప్రమాణములు పుష్కరాంశలు

| లగ్నం | ప్రమాణం గం. ని | పుష్కరాంశ గం. ని |
|---|---|---|
| మేషం | 1.30 | 01.03 |
| వృషభం | 1.52 | 00.52 |
| మిథునం | 2.17 | 01.48 |
| కర్కాటకం | 2.25 | 00.34 |
| సింహం | 2.23 | 01.40 |
| కన్య | 2.22 | 01.08 |
| తుల | 2.25 | 01.56 |
| వృశ్చికం | 2.22 | 00.33 |
| ధనుస్సు | 2.02 | 01.24 |
| మకరం | 1.37 | 00.45 |
| కుంభం | 1.22 | 01.15 |
| మీనం | 1.19 | 00.19 |

అమెరికాకు లగ్న ప్రమాణములు, పుష్కరాంశలు ఇచ్చిన మొట్టమొదటి పంచాంగమిదే.

## పంచాంగములోని సాంకేతిక పదాలు

ఉ - ఉదయము, మ - మధ్యాహ్నము, సా - సాయంత్రము, రా-రాత్రి, తె - తెల్లవారుఝాము అనగా మరుసటి సూర్యోదయం ముందు, సూ.ఉ-సూర్యోదయం, సూ.అ-సూర్యాస్తమయం, అమృతం - మంచి సమయం, వర్జ్యం-విడువదగిన సమయము, దుర్ముహూర్తం - చెడు సమయం.

## హోరా చక్రము - అధిపతులు - ఫలితములు

| పగలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని |
| సోమ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి |
| మంగళ | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర |
| బుధ | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |

| రాత్రి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు |
| మంగళ | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |
| బుధ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని |
| గురు | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి |
| శుక్ర | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర |
| శని | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చన్ద్ర | శని | గురు | కుజ |

**వివరము-** శుభగ్రహహోరలు (చంద్ర,బుధ,గురు,శుక్ర) పూర్ణ చంద్రుడు,శుభులతో కూడిన బుధుడు శుభప్రదములు. పాపగ్రహహోరలు(రవి,కుజ,శని) క్షీణ చంద్రుడు,పాపులతో కూడిన బుధుడు ఫలితము మందముగా నుండును. హెూర అనగా 1 గంట సమయము.

సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు గల కాలమును 12 చే భాగించగా వచ్చే సమయము పగటి కాలహోరలు, సూర్యాస్తమయము నుండి సూర్యోదయము వరకు గల కాలమును 12 చే భాగించగా వచ్చే సమయము రాత్రి కాలహోరలు అగును. వేసవి కాలము పగటి హెూరలు, శీతా కాలము రాత్రి హోరలు పెరుగుచుండును.

**హోరలు ఫలితములు -రవి-** రాజకీయ,కోర్టు వ్యవహారములు,ఔషధసేవకు,ప్రభుత్వ ఉద్యోగ ప్రయత్నములకు,సన్మానము చేయుటకు,అధికారులతో మాట్లాడుటకు మంచిది. **చంద్ర-**తెల్లని వస్తువులు క్రయవిక్రయమునకు,మాతృసేవ,సుఖభోజనము,సముద్ర ప్రయాణం మంచిది. **కుజ-**కరంటు,వ్యవసాయ, ఇటుక బట్టీలు నిప్పుపెట్టే పనులకు,సాహసకార్యాలకు,రాజసేవకు, సైన్యములో చేరుటకు,భూమి పనులకు మంచిది. **బుధ-**వ్యాపార పనులు,వ్యాకరణ,గణిత,గ్రంథ రచనా,మంత్ర శాస్త్రములు నేర్చుకునుటకు, బెల్లము,రత్నములు అమ్ముటకు,కొనుటకు మంచిది. **గురు-**క్రొత్త బంగారము,వస్త్రములు ధరించుటకు,గ్రంథారంభ,సంస్కృతము,కవిత్వము నేర్చుకొనుటకు ధనమును దాచుటకు,వాహన కొనుగోలుకు మంచిది. **శుక్ర-**తెల్లని వస్త్రములు ధారణకు,సువాసన వస్తువులు సేకరణకు,గాంధర్వ వివాహమునకు,సమస్త శుభకార్యాలకు,శాస్త్రసంబంధచర్చలకుమంచిది. **శని-**ఇనుము,తిలలు,నూనె, పుగాకు, యంత్ర వ్యాపారములకు,జూదమాడుటకు,మద్యపానము స్వీకరించుటకు, కార్లురిపేరుకు మంచిది.

## నామ నక్షత్ర పాద - రాశి - గణ - జంతు - నాడి తెలుపు పట్టిక

| పేరులో మొదటి అక్షరం | నక్షత్రము,పాదం | రాశి | గణం | జంతువు | నాడి |
|---|---|---|---|---|---|
| చూ,చే,చో,లా | అశ్విని 1,2,3,4 | మేషం | దేవ | గుఱ్రం | ఆది |
| లీ,లూ,లే,లో | భరణి 1,2,3,4 | మేషం | మనుష్య | ఏనుగు | మధ్య |
| ఆ,ఈ,ఊ,ఏ | కృత్తిక 1,కృత్తిక 2,3,4 | మేష,వృష | రాక్షస | మేక | అంత్య |
| ఓ,వా,వీ,వూ | రోహిణి 1,2,3,4 | వృషభం | మనుష్య | పాము | అంత్య |
| వే,వో,కా,కీ | మృగశిర 1,2,మృగ 3,4 | వృష,మిథు | దేవ | పాము | మధ్య |
| కూ,కం,ఙ,ఛ | ఆరుద్ర 1,2,3,4 | మిథునం | మనుష్య | కుక్క | ఆది |
| కే,కో,హా,హి | పునర్వ 1,2,3,పునర్వ 4 | మిథు,కర్కా | దేవ | పిల్లి | ఆది |
| హూ,హే,హో,ఢా | పుష్యమి 1,2,3,4 | కర్కాటకం | దేవ | మేక | మధ్య |
| డీ,డూ,డే,డో | ఆశ్రేష 1,2,3,4 | కర్కాటకం | రాక్షస | పిల్లి | అంత్య |
| మా,మీ,మూ,మే | మఖ 1,2,3,4 | సింహం | రాక్షస | ఎలుక | అంత్య |
| మో,టా,టీ,టూ | పుబ్బ 1,2,3,4 | సింహం | మనుష్య | ఎలుక | మధ్య |
| టే,టో,పా,పి | ఉత్తర 1,ఉత్తర 2,3,4 | సింహ,కన్య | మనుష్య | గోవు | ఆది |
| పూ,షం,ణా,ఠా | హస్త 1,2,3,4 | కన్య | దేవ | దున్న | ఆది |
| పే,పో,రా,రి | చిత్త 1,2,చిత్త 3,4 | కన్య,తుల | రాక్షస | పులి | మధ్య |
| రూ,రే,రో,తా | స్వాతి 1,2,3,4 | తుల | దేవ | దున్న | అంత్య |
| తీ,తూ,తా,తో | విశాఖ 1,2,3,విశాఖ 4 | తుల,వృశ్చి | రాక్షస | పులి | అంత్య |
| నా,నీ,నూ,నే | అనూరాధ 1,2,3,4 | వృశ్చికం | దేవ | లేడి | మధ్య |
| నో,యా,యీ,యూ | జ్యేష్ఠ 1,2,3,4 | వృశ్చికం | రాక్షస | లేడి | ఆది |
| యే,యో,బా,బి | మూల 1,2,3,4 | ధనుస్సు | రాక్షస | కుక్క | ఆది |
| బూ,ధా,భా,డా | పూర్వాషాఢ 1,2,3,4 | ధనుస్సు | మనుష్య | కోతి | అంత్య |
| బే,బో,జా,జి | ఉత్తరాషాఢ1,ఉ.షాఢ 2,3,4 | ధను,మకర | మనుష్య | ముంగిస | అంత్య |
| జూ,జే,జో,ఖా | శ్రవణం 1,2,3,4 | మకరం | దేవ | కోతి | అంత్య |
| గా,గీ,గూ,గే | ధనిష్ఠ 1,2,ధనిష్ఠ 3,4 | మకర,కుంభ | రాక్షస | గుఱ్రం | ఆది |
| గో,సా,సీ,సూ | శతభిషం 1,2,3,4 | కుంభం | రాక్షస | గుఱ్రం | ఆది |
| సే,సో,దా,ది | పూర్వాభాద్ర 1,2,3,పూ.భాద్ర 4, | కుంభ,మీన | మనుష్య | సింహం | ఆది |
| దు,శ్యం,ఝా,థా | ఉత్తరాభాద్ర 1,2,3,4 | మీనం | మనుష్య | గోవు | మధ్య |
| దే,దో,చా,చి | రేవతి 1,2,3,4 | మీనం | దేవ | ఏనుగు | అంత్య |

## నామ నక్షత్ర సందేహ వివరణ

**నరస్య ద్వయ నామాచ ఆది నామాన్ విసర్జయేత్ । అంత్య నామ గృహీత్వాచ ఇత్యేతే లగ్న కారణమ్ ॥**

విశేష నామములు గలవారు ఆది నామములను విడిచి పెట్టవలెను. అనగా వీర వెంకట అప్పారావు అను పేరుకు “వీర వెంకట” విడిచి పెట్టి “అప్పారావు” అనే పేరును తీసుకోవలెను. అలానే మిగిలిన పేర్లను తెలుసుకోవలెను. ద్విత్వాక్షరము వచ్చినప్పుడు అనగా “ప్రభాకర్” అనే పేరు వచ్చి నప్పుడు‘ప’ క్రింద ఉన్న ‘్ర’ రకారమునకు పలికే ర అనే అక్షరమును తీసుకుని చూడాలి. అలాగే “శ్రీ” అని ఉన్నప్పుడు క్రింది ఉన్న ‘్ర’ రకారమునకు పలికే ‘శీ’ లోని ‘ఈ’ కార మును కలుపుకుని ‘రీ’ గా తీసుకునవలెను. పై చెప్పిన ప్రకారము “ప్రభాకర్”కు చిత్త 1 వ పాదము అగును. ‘శ్రీ’ కి చిత్త 4 వ పాదము అగును.ఇలానే మిగిలిన నామ నక్షత్రములు గ్రహించాలి.

**గమనిక-** పైన పేరులోని మొదటి అక్షరాలు ఆయా నక్షత్రములకు చెందినవిగా గుర్తించాలి. ఇందులో ఉన్న అక్షరాలు కాక వేరే అక్షరాలు ఉన్నట్లయితే **ఉదాహరణకు**-సత్యనారాయణ పేరు ఉందను కుందాం. మొదటి అక్షరం ‘స’ అయింది.పట్టికలో అది లేదు. శతభిషా నక్షత్రమునకు ఎదురుగా, “సా” అనే అక్షరము ఉన్నది.దీనికి ముందు ‘స’ గనుక ‘స’ ‘సా’ అనే అక్షరాలు శతభిషం 2 వ పాదం అవుతుంది. ఇలానే మిగిలినవి తెలుసుకోవచ్చును.అచ్చులు ద్విత్వాక్షరాలుగా వచ్చినప్పుడు ముందు అక్షరము, హల్లులు ద్విత్వాక్షరాలుగా వచ్చినప్పుడు క్రింది అక్షరములను గ్రహించాలి.

## ప్రతి దినము సులభముగా తారాబలము గుర్తించు పట్టిక

| రోజువారీనక్షత్రము / జన్మ,నామ నక్షత్రము | అశ్విని మఖ మూల | భరణి పుబ్బ పూ.షా | కృత్తిక ఉత్తర ఉ.షా | రోహి హస్త శ్రవ | మృగ చిత్త ధని | ఆరు స్వాతి శత | పునర్వ విశాఖ పూ.భా | పుష్య అనూ ఉ.భా | ఆశ్రే జ్యేష్ఠ రేవ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి మఖ మూల | జన్మ | సంప | విప | క్షేమ | ప్రత్య | సాధన | నైధన | మిత్ర | ప.మిత్ర |
| భర పుబ్బ పూ.ఢ | ప.మిత్ర | జన్మ | సంప | విప | క్షేమ | ప్రత్య | సాధన | నైధన | మిత్ర |
| కృత్తి ఉత్త ఉ.ఢ | మిత్ర | ప.మిత్ర | జన్మ | సంప | విప | క్షేమ | ప్రత్య | సాధన | నైధన |
| రోహి హస్త శ్రవ | నైధన | మిత్ర | ప.మిత్ర | జన్మ | సంప | విప | క్షేమ | ప్రత్య | సాధన |
| మృగ చిత్త ధని | సాధన | నైధన | మిత్ర | ప.మిత్ర | జన్మ | సంప | విప | క్షేమ | ప్రత్య |
| ఆరు స్వాతి శత | ప్రత్య | సాధన | నైధన | మిత్ర | ప.మిత్ర | జన్మ | సంప | విప | క్షేమ |
| పున విశా పూ.భా | క్షేమ | ప్రత్య | సాధన | నైధన | మిత్ర | ప.మిత్ర | జన్మ | సంప | విప |
| పుష్య అనూ ఉ.భా | విప | క్షేమ | ప్రత్య | సాధన | నైధన | మిత్ర | ప.మిత్ర | జన్మ | సంప |
| ఆశ్రే జ్యేష్ఠ రేవ | సంప | విప | క్షేమ | ప్రత్య | సాధన | నైధన | మిత్ర | ప.మిత్ర | జన్మ |

మీకు గల సమస్యలకు పంచాంగకర్త పళ్ళావఝుల లలిత గారు సమాధానము ఇస్తారు. ఇండియాలోని సమయము ప్రకారం సాయంత్రము 4.00 నుండి రాత్రి 9.00 గంటల వరకు

## శిశు జనన నక్షత్ర పాదదోషములు - వివరములు

| నక్షత్రము | పాదము 1 | పాదము 2 | పాదము 3 | పాదము 4 |
|---|---|---|---|---|
| అశ్విని | తండ్రి | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | మంచిది | శిశువునకు |
| కృత్తిక | మంచిది | చెడ్డది | మంచిది | తల్లికి |
| రోహిణి | దోషము | దోషము | దోషము | దోషము |
| మృగశిర | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| ఆరుద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | చెడ్డది | చెడ్డది | మంచిది |
| ఆశ్రేష | మంచిది | ధనహాని | తల్లి | తండ్రి |
| మఖ | చెడ్డది | మంచిది | చెడ్డది | మంచిది |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉత్తర | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| హస్త | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| చిత్త | చెడ్డది | చెడ్డది | మంచిది | మంచిది |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |
| అనూరాధ | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| జ్యేష్ఠ | తల్లి | బంధువులకు | శిశువు | తండ్రి |
| మూల | తండ్రి | తల్లి | ధనహాని | మంచిది |
| పూర్వాషాఢ | మంచిది | మంచిది | చెడ్డది | మంచిది |
| ఉత్తరాషాఢ | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | చెడ్డది | మంచిది | మంచిది |
| శతభిషం | చెడ్డది | మంచిది | మంచిది | మంచిది |
| పూర్వాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఉత్తరాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | చెడ్డది |

### వివరము

గండ దోషములు శిశువు జన్మించిన నాటి నుండి 8 సంవత్సరములు వరకు మాత్రమే ఉండును. తదుపరి ఎట్టి పరిస్థితులలోను దోషములు ఉండవు. కావున 8 సం॥లు దాటిన వారికి దోషములు ఆపాదించ వద్దని ఇటు పురోహితులకు, జ్యోతిష వేత్తలకు, తెలిసీ తెలియని వారికి సవినయముగా మనవి చేసుకొనుచున్నాము. శిశువు జన్మించిన తరువాత జాతకమును పరిశీలించి శాంతులు చేయవలెను. అంతేగాని జ్యేష్ఠ,మూల, రోహిణి అయింది కదా అని శాంతులు చేయక్కరలేదు. అయితే శిశువు అభివృద్ధి కొరకు ఏ నక్షత్రమునందు పుట్టిననూ శాంతిని చేయుట శుభము. పై నక్షత్ర పాద దోష ములు రాశుల సహజ భావ లక్షణాలను బట్టి చెప్పిబడినవి.

జాతకము బలవత్తరము అయినప్పుడు శాంతులు అవసరములేదు. ఇప్పటికీపైనక్షత్ర పాదదోషములు ఎందుకు ఎలా నిర్ణయించారో చాలామందికి తెలియదు. కేవలం పంచాంగములో ఉన్నవి కనుక చేస్తున్నామని చాలామందిని మేము అడగగా చెప్పియున్నారు.

అవసరమైన వారికి సహాయం చేయండి అదే మిమ్మల్ని కాపాడుతుంది.
వైద్య వాహనములకు దారిని ఇవ్వండి.

## గౌరీ పంచాంగము

### పగలు

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| విషం | ఉద్యో | ఉద్యో | శుభం | జ్వరం | అమృ | ఉద్యో |
| అమృ | లాభం | అమృ | ఉద్యో | లాభం | కలహ | జ్వరం |
| శుభం | జ్వరం | లాభం | రోగం | అమృ | లాభం | శుభం |
| ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | సుఖం | లాభం |
| అమృ | లాభం | విషం | ధనం | కలహ | ధనం | ధనం |
| విషం | జ్వరం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

### రాత్రి

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విషం |
| అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| జ్వరం | ధనం | కలహ | విషం | కలహ | కలహ | శుభం |
| రోగం | ఉద్యో | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| కలహ | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహ |
| లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

న తిథిర్న చ నక్షత్రం చ నయోగ కరణం తథా ।
న హెూరా యోగినీ చక్రం నలగ్నం నతమో గుణమ్॥
వ్యతీపాతే చ సంక్రాంతౌ భద్రాయా మశుభే దినే ।
శివాలిఖిత మాలోక్య సర్వత్ర విజయీ భవేత్ ॥

తిథి,నక్షత్ర,యోగ,కరణములతో పని లేదు. వర్జ్యము, దుర్ముహూర్తము, సంక్రాంతి, వ్యతీపాత, భద్ర ఇతర చక్రములు శుద్ధి లేని సమయములో గౌరీ పంచాంగము శుభప్రదము. ఈ సమయములు జాగ్రత్తగా చూసు కుంటూ ఉన్న ఎడల సర్వ కార్యములందు జయము కలుగునని పండితుల వచనం.

సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు గం 1.30 ని॥లు కలుపుకుంటూ పగలు, సూర్యాస్తమయము నుండి సూర్యోదయము వరకు గం1.30 ని॥లు కలుపుకుంటూ రాత్రి,ముహూర్తములు గమనించుకోవాలి.

పగలు,రాత్రి కాలములను 8 భాగములు చేయగా సుమారు గం 1.30 ని॥లు వచ్చును. వేసవి, శీతాకాలములందు సమయాలు మారును. ఉద్యోగ, రాజకీయ పనులకు శుభ ప్రదము.

## ప్రయాణ విషయములు

**ప్రయాణమునకు శుభ దిశావారములు** – తూర్పునకు మంగళవారము, దక్షిణమునకు శని, సోమ వారములు, పశ్చిమమునకు బుధ,గురువారములు,ఉత్తరమునకు శుక్ర వారము లాభదాయకము.

**ప్రయాణమునకు వారశూలలు** – తూర్పునకు సోమ,శనివారము, దక్షిణమునకు గురువారము, పశ్చిమమునకు ఆది,శుక్రవారములు,ఉత్తరమునకు బుధవారము వారశూలలుండును.

**గమనిక** – ప్రయాణము చేసే సమయములో సూర్యోదయానికి ముందు ఎట్టి మంచి సమయాలు అవసరము లేదు. సూర్యోదయం తరువాత మధ్యాహ్నం 12 గంటలు లోపు మాత్రమే వారశూల చూసుకోవాలి. ఒకవేళ చేయవలసి వస్తే భోజనం చేసి ప్రయాణమైన ఎడల ఎట్టి దోషములు సంభవించవు. ప్రయాణములో దేవతా స్తోత్రములు చదువుతూ ఉన్న ఎడల విజయవంతముగా పూర్తి అగును.

## ప్రతి దినము సులభముగా తారాబలము గుర్తించు పట్టిక

| జన్మతారలు | 1 వ నవకం జన్మతార | 2 వ నవకం విపత్తార | 3 వ నవకం ప్రత్యక్తార | 1, 2, 3 నవకాలలో నైధనతారలు | | |
|---|---|---|---|---|---|---|
| అశ్విని | అశ్విని | ఉత్తర | ధనిష్ఠ | పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర |
| భరణి | భరణి | హస్త | శతభిషం | పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర |
| కృత్తిక | కృత్తిక | చిత్త | పూర్వాభాద్ర | ఆశ్రేష | జ్యేష్ఠ | రేవతి |
| రోహిణి | రోహిణి | స్వాతి | ఉత్తరాభాద్ర | మఖ | మూల | అశ్విని |
| మృగశిర | మృగశిర | విశాఖ | రేవతి | పుబ్బ | పూర్వాషాఢ | భరణి |
| ఆరుద్ర | ఆరుద్ర | అనూరాధ | అశ్విని | ఉత్తర | ఉత్తరాషాఢ | కృత్తిక |
| పునర్వసు | పునర్వసు | జ్యేష్ఠ | భరణి | హస్త | శ్రవణం | రోహిణి |
| పుష్యమి | పుష్యమి | మూల | కృత్తిక | చిత్త | ధనిష్ఠ | మృగశిర |
| ఆశ్రేష | ఆశ్రేష | పూర్వాషాఢ | రోహిణి | స్వాతి | శతభిషం | ఆరుద్ర |
| మఖ | మఖ | ఉత్తరాషాఢ | మృగశిర | విశాఖ | పూర్వాభాద్ర | పునర్వసు |
| పుబ్బ | పుబ్బ | శ్రవణం | ఆరుద్ర | అనూరాధ | ఉత్తరాభాద్ర | పుష్యమి |
| ఉత్తర | ఉత్తర | ధనిష్ఠ | పునర్వసు | జ్యేష్ఠ | రేవతి | ఆశ్రేష |
| హస్త | హస్త | శతభిషం | పుష్యమి | మూల | అశ్విని | మఖ |
| చిత్త | చిత్త | పూర్వాభాద్ర | ఆశ్రేష | పూర్వాషాఢ | భరణి | పుబ్బ |
| స్వాతి | స్వాతి | ఉత్తరాభాద్ర | మఖ | ఉత్తరాషాఢ | కృత్తిక | ఉత్తర |
| విశాఖ | విశాఖ | రేవతి | పుబ్బ | శ్రవణం | రోహిణి | హస్త |
| అనూరాధ | అనూరాధ | అశ్విని | ఉత్తర | ధనిష్ఠ | మృగశిర | చిత్త |
| జ్యేష్ఠ | జ్యేష్ఠ | భరణి | హస్త | శతభిషం | ఆరుద్ర | స్వాతి |
| మూల | మూల | కృత్తిక | చిత్త | పూర్వాభాద్ర | పునర్వసు | విశాఖ |
| పూర్వాషాఢ | పూర్వాషాఢ | రోహిణి | స్వాతి | ఉత్తరాభాద్ర | పుష్యమి | అనూరాధ |
| ఉత్తరాషాఢ | ఉత్తరాషాఢ | మృగశిర | విశాఖ | రేవతి | ఆశ్రేష | జ్యేష్ఠ |
| శ్రవణం | శ్రవణం | ఆరుద్ర | అనూరాధ | అశ్విని | మఖ | మూల |
| ధనిష్ఠ | ధనిష్ఠ | పునర్వసు | జ్యేష్ఠ | భరణి | పుబ్బ | పూర్వాషాఢ |
| శతభిషం | శతభిషం | పుష్యమి | మూల | కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ |
| పూర్వాభాద్ర | పూర్వాభాద్ర | ఆశ్రేష | పూర్వాషాఢ | రోహిణి | హస్త | శ్రవణం |
| ఉత్తరాభాద్ర | ఉత్తరాభాద్ర | మఖ | ఉత్తరాషాఢ | మృగశిర | చిత్త | ధనిష్ఠ |
| రేవతి | రేవతి | పుబ్బ | శ్రవణం | ఆరుద్ర | స్వాతి | శతభిషం |

**పురోహితులకు సూచన:** ఎవరి యింటికైనా జపములకు వెళ్లినప్పుడు జపం మధ్యలో మాట్లాడరాదు. జపం మధ్యలో సెల్‌ఫోన్లు మాట్లాడరాదు. కనీసం 3 గంటల సేపు కదలకుండా జపం చేయవలెను. అప్పుడే మీరు చేసిన జపానికి సార్థకత, లేదంటే నిరర్థకత – **సేకరణ, బుద్ధిమాన్**

## ప్రక్క పట్టికకు వివరము

**మన జన్మనక్షత్రానికి ఎదురుగా ఉండే తారలను విడిచిపెట్టి మిగిలినవి వాడుకోవచ్చు. ఎట్టి దోషములుఉండవు.** శుభ కార్యములకు ప్రథమ నవకములో జన్మతార,ద్వితీయ నవకములో విపత్తార,తృతీయ నవకములో ప్రత్యక్తార,మూడు నవకాలలోనూ నైధనతార విడిచి పెట్టవలెను. ఇతర నవకాలలో ఆ తారలు వచ్చినప్పుడు దానములు ఇచ్చి దోషకాలము వదిలి పనులు చేసు కొనవచ్చును.

**ఉదా :** ఒక వ్యక్తిది రోహిణి నక్షత్రం అనుకుందాము.

1) రోహిణి నుండి ఉత్తర వరకు ప్రథమ నవకం అనగా 1వ నవకం అగును.ఇందులో రోహిణి జన్మతార అగును. కాన విడిచి పెట్టాలి. **సారాంశము :** రోహిణి నుండి రోహిణి తప్ప జన్మతారలైన హస్త,శ్రవణం పని చేస్తాయి.

2) హస్త నుండి ఉత్తరాషాఢ వరకు ద్వితీయ(2) నవకం అగును.2 వ నవకంలో 3 వ దైన విప త్తార అనగా స్వాతి విడిచి పెట్టాలి. **సారాంశము :** స్వాతి తప్ప విపత్తారలైన శతభిషం,ఆరుద్ర పని చేస్తాయి.

3) శ్రవణం నుండి కృత్తిక వరకు తృతీయ (3) నవకం అగును. 3 వ నవకంలో 5 వదైన ప్రత్య క్తార అనగా ఉత్తరాభాద్ర విడిచి పెట్టాలి. **సారాంశము :** ఉత్తరాభాద్ర తప్ప ప్రత్యక్తారలైన అనూ రాధ, పుష్యమి పని చేస్తాయి.

4) 1,2,3 నవకాలలోనూ నైధనతారను ఎల్లప్పుడూ విడిచి పెట్టవలెను. రోహిణి ఉదాహరణగా తీసుకున్నాం గనుక 1వ నవకంలో మఖ,2 వ నవకంలో మూల, 3 వ నవకంలో అశ్విని విడి చి పెట్టాలి.

అలానే ఏ నక్షత్రం అయితే ఆ నక్షత్రము నుండి 9 చొప్పున 3 భాగములు నవకాలుగా విభజిం చుకుని పట్టిక తయారు చేసుకోవాలి.

| తారలకు అధిపతులు– వాహనము – దానము | | | | ప్రారంభము నుండి విడిచే సమయం | తారల స్వభావము |
|---|---|---|---|---|---|
| తారలు | అధిపతి | వాహనము | దానము | | |
| 1) జన్మతార | సూర్యుడు | నెమలి | తోటకూర | గం 2.48 ని॥లు | దేహనాశనం |
| 2) సంపత్తార | బుధుడు | గుర్రము | – | – | ధనము |
| 3) విపత్తార | రాహువు | మేక | బెల్లం | గం 1.12 ని॥లు | కార్యహాని |
| 4) క్షేమతార | గురుడు | ఏనుగు | – | – | శుభము |
| 5) ప్రత్యక్తార | కేతువు | కాకి | ఉప్పు | గం 3.12 ని॥లు | కార్యనష్టం |
| 6) సాధనతార | చంద్రుడు | నక్క | – | – | కార్యజయం |
| 7) నైధనతార | శని | సింహము | బంగారము నువ్వులు | గం 3.12 ని॥లు | పనినిలుపుదల |
| 8) మిత్రతార | శుక్రుడు | గ్రద్ద | – | – | శుభము |
| 9) పరమమిత్రతార | కుజుడు | హంస | – | – | మందము |

చెడుతారలు వచ్చినప్పుడు పట్టికలో చూపించిన విధముగా ప్రారంభం నుండి ఆయా సమయములు విడిచి మిగిలిన సమయములు ఉపయోగించుకోవచ్చును,ఎట్టి దోషములు ఉండవు.

## ప్రయాణమునకు ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని | యోగం | రోజులు | ఫలితం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆర్ద్రే | హస్త | అనూ | ఉ.షా | శత | ఆనన్ద | 15 | కార్యసిద్ధి |
| భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | కాలదన్డ | 27 | కార్యనష్టం |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | ధూమ్ర | 8 | ధననష్టం |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | ధాత్రీ | 4 | కార్యసిద్ధి |
| మృగ | ఆర్ద్రే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | సౌమ్య | 30 | సర్వసౌఖ్యం |
| ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ధ్వాంక్ష | 5 | కార్యహాని |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | ధ్వజ | 10 | కార్యసిద్ధి |
| పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | శ్రీవత్స | 3 | కార్యసిద్ధి |
| ఆర్ద్రే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | వజ్ర | 2 | కార్యహాని |
| మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | ముద్గర | 1 | కలహం |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | ఛత్ర | 3 | స్త్రీలాభం |
| ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర | 5 | మిత్రలాభం |
| హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆర్ద్రే | మానస | 2 | కార్యలాభం |
| చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | మఖ | పద్మ | 1 | ధనలాభం |
| స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | లంబ | 3 | నష్టము |
| విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ఉత్పాత | 4 | ధనహాని |
| అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆర్ద్రే | హస్త | మృత్యు | 10 | అనారోగ్యం |
| జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | కాల | 5 | భంగము |
| మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధి | 7 | కార్యసిద్ధి |
| పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | శుభ | 6 | కార్యసిద్ధి |
| ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆర్ద్రే | హస్త | అనూ | అమృత | 2 | కార్యసిద్ధి |
| అభి | పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | ముసల | 8 | దు:ఖము |
| శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదా | 40 | కార్యహాని |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | మాతంగ | 2 | వాహనప్రాప్తి |
| శత | అశ్వి | మృగ | ఆర్ద్రే | హస్త | అనూ | ఉ.షా | రాక్షస | 9 | కలహం |
| పూ.భా | భర | ఆరు | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | చర | 8 | అస్థిరత |
| ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థిర | 3 | సామాన్యం |
| రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | వర్ధమాన | 10 | శుభము |

ఆనంద, ధాత్రీ, సౌమ్య, ధ్వజ, శ్రీవత్స, ఛత్ర, మిత్ర, మానస, పద్మ, సిద్ధ, శుభ, అమృత, మాతంగ, వర్ధమాన **యోగములు శుభప్రదము.**, గదాయోగము ప్రారంభమున 24 ని॥లు, కాల,ముసల యోగములు ప్రారంభమున 48 ని॥లు పద్మ,లంబ యోగముల ప్రారంభమున గం1.36 నిలు,ధ్వాంక్ష,వజ్ర,ముద్గర యోగములకు ప్రారంభమున గం 2.00 లు విడిచి పెట్టవలెను. తదుపరి కాలము శుభప్రదము. రాక్షస, మృత్యు,ఉత్పాత ఈ 3 యోగములు పూర్తిగా విడిచి పెట్టవలెను.

## ప్రయాణమునకు అమృతాది యోగములు

| నక్షత్రములు | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | సిద్ధ | సిద్ధ | అసి | మృత్యు | అమృ | అమృ | సిద్ధ |
| భరణి | అసి | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| కృత్తిక | అసి | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ |
| రోహిణి | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | ఉత్పా | సిద్ధ | అమృ |
| మృగశిర | సిద్ధ | అసి | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | సిద్ధ |
| ఆరుద్ర | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | మృత్యు | సిద్ధ |
| పునర్వసు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ |
| పుష్యమి | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అసి | సిద్ధ | సిద్ధ |
| ఆశ్లేష | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | మృత్యు |
| మఖ | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | అమృ | మృత్యు | అమృ |
| పుబ్బ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| ఉత్తర | అమృ | సిద్ధ | అమృ | అమృ | మృత్యు | సిద్ధ | ఉత్పా |
| హస్త | అసి | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు |
| చిత్త | సిద్ధ | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| స్వాతి | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | అమృ |
| విశాఖ | ఉత్పా | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| అనూరాధ | మృత్యు | సిద్ధ | అసి | అసి | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| జ్యేష్ఠ | మృత్యు | సిద్ధ | ఉత్పా | సిద్ధ | ప్రబ | మృత్యు | సిద్ధ |
| మూల | అమృ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ | సిద్ధ |
| పూర్వాషాఢ | సిద్ధ | ఉత్పా | సిద్ధ | అమృ | సిద్ధ | ప్రబ | సిద్ధ |
| ఉత్తరాషాఢ | అమృ | మృత్యు | ప్రబ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శ్రవణం | అమృ | అమృ | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ |
| ధనిష్ఠ | మృత్యు | సిద్ధ | సిద్ధ | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శతభిషం | సిద్ధ | సిద్ధ | మృత్యు | అసి | మృత్యు | సిద్ధ | అమృ |
| పూర్వాభాద్ర | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| ఉత్తరాభాద్ర | అమృ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| రేవతి | అమృ | సిద్ధ | సిద్ధ | ఉత్పా | సిద్ధ | ఉత్పా | ప్రబ |

### వివరం

**మంచివి**

అమృ – అమృతయోగము
అసి – అమృతసిద్ధ యోగము
సిద్ధ – సిద్ధయోగము

**చెడ్డవి**

మృత్యు – మృత్యుయోగము
ప్రబ – ప్రబలారిష్టయోగము
ఉత్పా – ఉత్పాత యోగము

**సూచన**

గ్రహస్థితులను అనుసరించి లగ్నబలము ఉన్నప్పుడు అమృతాది, ఆనందాది విషయములు పెద్దగా పట్టించు కోవలిసిన అవసరము లేదు. భరణి, పునర్వసు,పుష్యమి, పుబ్బ, స్వాతి ఈ 5 ఏ వారమైనా దోషము లేదు.

**నిర్ధ్య విషయములు** – నిషిద్ధ కాలములందు తప్పనిసరి పరిస్థితులలో ప్రయాణము చేయునప్పుడు ఆదివారం – బంగారము, సోమవారం–వస్త్రము, మంగళవారం–ఆయుధం, బుధవారం –పుస్తకం, గురువారం – గొడుగు, టోపి, శుక్రవారం–చెప్పులు,వాహనము, శనివారం– కంఠాభరణము ముందురోజు ఎవరి ఇంటనైనా ఉంచి మంచి శకునము చూసుకుని ప్రయాణమై వెళ్ళవచ్చును.

**ప్రయాణ సమయములో ఆంజనేయస్వామిని,మృత్యుంజయుడిని స్మరిస్తూ ఉండిన శుభప్రదము.**

## రాజాది నవ నాయకులు

**1. రాజు : గురుడు :** మంచివారుకర్మనిష్ఠతోనుందురు. పాలకులు నీతివంతులుగా నుందురు. దేశము సుభిక్షముగా నుండును. మంచి వర్షము కలుగును. ఆవులు ఎక్కువ పాలని చ్చును. భార్య భర్తలు కామోపచారములచేత సంతోషపడుదురు.

**2. మంత్రి : బుధుడు :** మబ్బులు వాయువుతో కూడిఉండును. నరులు పాపవంతులుగా నుందురు. పై ఫలములు మధ్యమములై ఉండును.

**3. సేనాధిపతి : కుజుడు :** జనులకు అతిపీడ కలుగును. పంటలు నాశన మగును. సమస్త జనులు జ్వరపీడలతో ఉండును. నాయకులకు పరస్పరము యుద్ధములు కలుగును.

**4. సస్యాధిపతి : శని :** నువ్వులు, మినువులు, ఉలవలు మొదలగు నల్లని ధాన్యములు పూర్తిగా పండు ను. నల్లని నేల ఫలించును.

**5. ధాన్యాధిపతి : గురుడు :** దేశములయందు అన్ని పంటలు పుష్కల ముగా పండును. మంచి వర్షములు పడును. గోవులు పూర్తిగా పాల నిచ్చును.

**6. అర్ఘాధిపతి : కుజుడు :** కొద్ది వర్షములు వాయువుతోకూడి అక్కడ క్కడా కురియును. ధాన్య ము, జనక్షేమంబు అక్కడక్కడా ఉండును.

**7. మేఘాధిపతి : కుజుడు :** గాలి అధికముగా ఉండును. ధరలు తగ్గును. కొద్ది వర్షములు పడు ను. ఎర్రని ధాన్యములు ఫలించును.

**8. రసాధిపతి : చంద్రుడు :** నువ్వులు, నూనె, బెల్లము, తేనె, పాలు, పెరుగు, చక్కెర మొదలగు రస జాతులకు ధరలు కలిగి ఉండును. జనులు ఆరోగ్యవంతులుగా ఉండెదరు.

**9. నీరసాధిపతి : శని :** రాయి, మాంసము, కర్రపాత్రలు, లోహపాత్ర లకు ధరలు తగ్గును.

**గురుమూఢమి :** ది 8-9-2016 నుండి 12-10-2016 వరకు

**శుక్రమూఢమి :** ది. 9-5-2016 నుండి 11-7-2016 వరకు

తిరిగి 21-3-2017 నుండి సంవత్సరాంతం వరకు

మూఢమి సమయములందు మాస సంబంధ కార్యములు, శాంతులు, జపాలు ఆచరించవచ్చు. దేశ క్షేమం కోసం యాగములు చేయవచ్చు. ఉత్తరాది ప్రాంతము వారు వివాహము చేయవచ్చు. ఈ మూఢమి సమయంలో బ్రాహ్మణులకు సహాయపడుట మంచిది.

గమనిక : అమెరికా వారికి మౌఢ్య దోషము లేదు, గమనించగలరు. మూఢములు జరుగుచున్ననూ వివాహాది కార్యములు చేయవచ్చును.

### కృష్ణా పుష్కరములు



స్వస్తిశ్రీ దుర్ముఖి సం॥శ్రావణశుద్ద నవమి గురు వారము అనగా ది11-8- 2016 ఉ8.03 ని॥లకు దేవగురువు అయిన బృహస్పతి కన్యా రాశిలోనికి ప్రవేశించును.

కావున కృష్ణానదికి పుష్కరములు జరుగును. ఆగష్టు 11 నుండి 22 వరకు 12 రోజులు పుష్కరములు జరుగును.

అమెరికా వారికి అవకాశము లేదు కనుక మీదగ్గరిలోని సరస్సులు, నదుల దగ్గరకు వెళ్ళి సంకల్ప యుక్తముగా విధులు నిర్వహించవచ్చును.

### మకర సంక్రాంతి పురుష ఫలము



స్వస్తిశ్రీ దుర్ముఖ నామ సంవత్సర పుష్యబహుళ విదియ శుక్రవారం ఆశ్రేషా నక్షత్రయుక్త కన్యాలగ్నమందు దీని కి సరియగు ఇంగ్లీషు తేది 13.01.2017 సా గం 6.01 ని.లకు సూర్యుడు మకరరాశిలోనికి ప్రవేశించును. 13 న సంక్రాంతి పండుగను జరుపుకొనుట శ్రేష్టము. ఈనాటి నుండే ఉత్తరాయణము ప్రారంభమగును.

### గ్రహణాలు

2016 ఆగష్టు 17 వ తేదీన
రాత్రి 2.22 నుండి 3.02 వరకు
ఈ గ్రహణం పాక్షికంగా మాత్రమే ఉంది.
ఏ విధమైన నియమ నిబంధనలు లేవు.

### గమనిక

అమెరికా వారికి కర్తరీ దోషము లేదు.
దయచేసి గమనించ గలరు.

పంచాంగకర్త
అంతర్జాతీయ తొలి మహిళా పంచాంగకర్త
**పల్లావఝ్ఝుల వేంకటసత్యలలితాఫణిలక్ష్మీ (లలిత)**
రామారావు పేట, తాడేపల్లిగూడెం - 534101
ప॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్, 8341170111

### కందాయ ఫలములు

| నక్షత్రము | మొదటి సంఖ్య | రెండవ సంఖ్య | మూడవ సంఖ్య |
|---|---|---|---|
| అశ్విని | 7 | 1 | 4 |
| భరణి | 2 | 2 | 1 |
| కృత్తిక | 5 | 0 | 3 |
| రోహిణి | 0 | 1 | 0 |
| మృగశిర | 3 | 2 | 2 |
| ఆరుద్ర | 6 | 0 | 4 |
| పునర్వసు | 1 | 1 | 1 |
| పుష్యమి | 4 | 2 | 3 |
| ఆశ్రేష | 7 | 0 | 0 |
| మఖ | 2 | 1 | 2 |
| పుబ్బ | 5 | 2 | 4 |
| ఉత్తర | 0 | 0 | 1 |
| హస్త | 3 | 1 | 3 |
| చిత్త | 6 | 2 | 0 |
| స్వాతి | 1 | 0 | 2 |
| విశాఖ | 4 | 1 | 4 |
| అనూరాధ | 7 | 2 | 1 |
| జ్యేష్ఠ | 2 | 0 | 3 |
| మూల | 5 | 1 | 0 |
| పూర్వాషాఢ | 0 | 2 | 2 |
| ఉత్తరాషాఢ | 3 | 0 | 4 |
| శ్రవణం | 6 | 1 | 1 |
| ధనిష్ఠ | 1 | 2 | 3 |
| శతభిషం | 4 | 0 | 0 |
| పూర్వాభాద్ర | 7 | 1 | 2 |
| ఉత్తరాభాద్ర | 2 | 2 | 4 |
| రేవతి | 5 | 0 | 1 |

కందాయ ఫలములలో ఒక్కొక్క సంఖ్య 4 మాసములకు సూచించును.

అనగా చైత్రము నుండి ఆషాఢము వరకు **మొదటి సంఖ్య**, శ్రావణము నుండి కార్తీకము వరకు **రెండవ సంఖ్య**, మార్గశిరము నుండి ఫాల్గుణము వరకు **మూడవ సంఖ్య** ను కందాయముగా చూసుకొనవలెను.

ఇందు బేసి సంఖ్యలు ధన లాభములు, సరిసంఖ్య సమ లాభమును సూచించును. మొదటి సున్న వ్యాధిని, రెండవ సున్న భయమును, మూడవ సున్న ఋణమును సూచించును. మూడు సున్నాలే వచ్చిన యెడల సంవత్సర మంతయూ కష్ట జీవనము సాగును.

### నక్షత్రరీత్యా సంవత్సర ఫలం

అశ్విని, పుష్యమి, స్వాతి, అభిజిత్
రాజపూజ్యం

భరణి, ఆశ్రేష, విశాఖ, శ్రవణం
యుద్ధభయం

కృత్తిక, మఖ, అనూరాధ, ధనిష్ఠ
అలంకారప్రాప్తి

రోహిణి, పుబ్బ, జ్యేష్ఠ, శతభిషం
రోగభయం

మృగ, ఉత్తర, మూల, పూ. భాద్ర
ఆయుర్వృద్ధి

ఆరుద్ర, హస్త, పూ. షాఢ, ఉ. భాద్ర
ధనలాభం

పునర్వ, చిత్త, ఉ. షాఢ, రేవతి
మనస్థాపం

## పండుగలు - పర్వదినాలు - ముఖ్య దినాలు

**చైత్ర మాసము**
**ఏప్రియల్**
7 ఉగాది,సంవత్సరాది, వసంతనవరాత్రారంభం
9 సౌభాగ్య గౌరీవ్రతం
మత్స్యజయంతి
11లక్ష్మీ పూజ,
15 శ్రీరామనవమి
17 కామద ఏకాదశి
25 సంకట హర చతుర్థి
**మే**
2 వరూధినీఏకాదశి
4 మాసశివరాత్రి
**వైశాఖ మాసము**
8 అక్షయతృతీయ,
10శంకరాచార్యజయంతి
16 మోహినీఏకాదశి,
25 సంకష్ట హరచతుర్థి
31 హనుమజ్జయంతి
**జూన్**
1 అపరఏకాదశి
3 మాసశివరాత్రి
**జ్యేష్ఠ మాసము**
14 దశపాపహరావ్రతం
15 నిర్జలేకాదశి
23 సంకష్టహర చతుర్థి
30 యోగినీఏకాదశి
**జూలై**
2 మాసశివరాత్రి
3 వటసావిత్రివ్రతం,

**ఆషాఢ మాసము**
6 పూరీ జగన్నాథ రథయాత్ర
15 శయన ఏకాదశి
తొలి ఏకాదశి
16 చాతుర్మాసారంభం
19 వ్యాస(గురు)పూర్ణిమ
22 సంకష్టహర చతుర్థి
29 కామికాఏకాదశి
31 మాసశివరాత్రి
**ఆగష్టు**
**శ్రావణ మాసము**
7 నాగపంచమి,
గరుడ పంచమి
12 వరలక్ష్మీవ్రతం
13 పుత్రద ఏకాదశి
17 శ్రావణ పూర్ణిమ
ఉపాకర్మ,రక్షాబంధన్
20సంకట హర చతుర్థి
24 కృష్ణాష్టమి
27 అజఏకాదశి
30 మాసశివరాత్రి
**సెప్టెంబరు**
**భాద్రపద మాసము**
4 వినాయక చవితి
5 ఋషిపంచమి
12 పరివర్తన ఏకాదశి
15 అనంతపద్మనాభవ్రతం
16 మహాలయారంభం
18 బృహత్యుమావ్రతం
వాస్తుపురుష జయంతి
19 సంకటహరచతుర్థి
26 ఇంద్రఏకాదశి
28 మాసశివరాత్రి

**ఆశ్వయుజ మాసము**
**అక్టోబరు**
1 శరన్నవరాత్రి
7 మూలపూజ
9 దుర్గాష్టమి
10 మహర్నవమి,
విజయ దశమి,
11 పాశాంకుశ ఏకాదశి
17 అట్లతదియ
చంద్రోదయగౌరీవ్రతం
18 సంకటహర చతుర్థి
25 రమాఏకాదశి
28 నరక చతుర్దశి
మాసశివరాత్రి
29 కేదారవ్రతం,
దీపావళి
**కార్తీక మాసము**
31 బలిపాడ్యమి
**నవంబరు**
1 యమపూజ
3 నాగుల చవితి
7 గోష్టాష్టమీవ్రతం
8 అక్షయనవమీవ్రతం
9 యాజ్ఞవల్క్య జయంతి
10 బోధన ఏకాదశి
11 యోగీశ్వరద్వాదశి
క్షీరాబ్దిద్వాదశి
చాతుర్మాస పూర్తి
13 జ్వాలాతోరణం
17 సంకట హరచతుర్థి
24 ఉత్థానఏకాదశి

27 మాసశివరాత్రి
28 గీతాజయంతి
**మార్గశిర మాసము**
**డిసెంబరు**
5 సుబ్రహ్మణ్యషష్టి
9 మోక్షదఏకాదశి
11 హనుమద్వ్రతం
13 దత్తజయంతి,
16 సంకట హరచతుర్థి
19 త్రిస్రోష్టకాలు
21 కాలభైరవాష్టమి
24 సఫలఏకాదశి
27 మాసశివరాత్రి
**పుష్య మాసము**
**జనవరి**
8 పుత్రద ఏకాదశి
ముక్కోటి ఏకాదశి
13 భోగి
14 సంక్రాంతి
15 సంకట హరచతుర్థి
కనుమ
16 ముక్కనుమ
18 త్రిస్రోష్టకాలు
25 మాసశివరాత్రి
**మాఘ మాసము**
**ఫిబ్రవరి**
1 మదనపంచమి
3 రథసప్తమి
4 భీష్మాష్టమి,భీష్మతర్పణం
6 జయ-భీష్మఏకాదశి
10 మహామాఘి

13 సంకట హరచతుర్థి
17 త్రిస్రోష్టకాలు
21 విజయఏకాదశి
24 మాసశివరాత్రి
మహాశివరాత్రి
**ఫాల్గున మాసము**
**మార్చి**
7 అమలఏకాదశి
10 కామదహనం
11 హోళికా పూర్ణిమ
12 వసంతోత్సవం
15 సంకట హరచతుర్థి
19 త్రిస్రోష్టకాలు
23 పాపమోచనఏకాదశి
26 మాసశివరాత్రి
27 క్రొత్త అమావాస్య

28
హేమలంబ
ఉగాది
శుభాకాంక్షలు



భారతదేశము నందు కాక ఇతర దేశములందు ముఖ్యంగా అమెరికాలో స్థిరపడిన తెలుగు వారి కోసం లాస్ఏంజల్స్ - శాన్‌ఫ్రాన్సిస్ పట్టణములకు సంపూర్ణ పంచాంగమును ఇచ్చుచున్నాము.

ఇందులో గ్రహణాలు,మూఢమి,మొదలగు విషయాలు,ముఖ్యంగా సవరణ చేసుకోవక్కర లేకుండా వివాహాది శుభముహూర్తములు ఖచ్చిత సమయాలు,లాస్ఏంజల్స్ లగ్న-పుష్కర కాలములకు ఇవ్వబడినవి.

వీటిని శాన్‌ఫ్రాన్సిస్ ప్రాంతము వారు 6 నిమిషాలు కలుపుకుని వాడుకోవచ్చు.

లాస్ ఏంజల్స్, శాన్ ఫ్రాన్సిస్కో వారే కాకుండా న్యూయార్క్, న్యూజెర్సీ, లండన్, వాషింగ్టన్, సింగపూర్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, మలేషియా మరియు తెలుగువారుండే ఏ దేశాలకైనా సంపూర్ణ పంచాంగము చేసి ఇవ్వబడును.

అంతేకాదు మీకు సంబంధించిన వారు ఏదేశంలో ఉన్నా ఆయా దేశాలకు పంచాంగాలను తయారుచేసి ప్రచురించి పంపవచ్చు. కానుకగా కూడా ఇవ్వవచ్చు.

ఇతర దేశములయందు గల పంచాంగకర్తలు కూడా సంప్రదించిన యెడల పంచాంగమును పంపగలము.

కావలసిన వారు 8341170111 నెంబర్లలో సంప్రదించవచ్చు. ఏ ముహూర్తము కావాలన్నా వెంటనే పై నెంబరుకు ఫోను చేయండి.

లేదా

vastuvidyavigjnanakendram@gmail.com,
vvvk711@gmail.com లో సంప్రదించండి.

### గమనిక :

శాన్‌ఫ్రాన్సిస్‌వారు " 6 " నిమిషాలు కలుపుకుని ముహూర్తాలను ఆచరించాలి

**పేశ్వావఝుల లలిత**
తాడేపల్లిగూడెం ప॥గో॥జిల్లా, 8341170111

## మేష



ఆదాయం -2 వ్యయం - 8
రాజపూజ్యం - 1 అవమానం - 7

**100 కి 60 శాతం ఫలితం**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరము సామాన్యముగా ఉన్నది. ఆశించిన పనులు ఇతరుల సహకారముచే పూర్తి అగును. కుటుంబమునందు, ఆర్థిక విషయాల యందు ఇతరుల జోక్యం వలన నష్టము వాటిల్లును. సోదర వర్గము నుండి సహాయము లభించదు. గృహమున కళ్యాణ వైభవము జరుగును. సంతానమునకు తెలయని అనారోగ్యముచే బాధపడును. భాగస్వామ్య వ్యవహారముల యందు సొంత నిర్ణయాలు తీసుకొనుట మేలు. రక్తసంబంధమైన వ్యాధులు వచ్చుటకు అవకాశము కలదు. పిత్రార్జితము కలసి వచ్చును. చేయు వృత్తియందు విశేష ప్రజ్ఞను కనబరచి పై అధికారుల మన్ననలు పొందుతారు. కోర్టు,విదేశీ వ్యవహారాలు మేలుగా ఉన్నవి.

ఈ రాశి స్త్రీలకు స్వప్రయత్నంచే లాభములు పొంది పలువురిదృష్టిని ఆకర్షిస్తారు.

### నక్షత్ర ఫలితాలు

**అశ్విని 1,2,3,4-** తలచిన కార్యములన్నియు విజయవంతంగా పూర్తిచేసు కోగలుగుతారు. బంధు,మిత్రుల వలన సహకారము పొందుతారు. తోటి ఉద్యోగులకు సహకరించే అవకాశం లభిస్తుంది. అనుకూల పరిస్థితులేర్పడతాయి.

**భరణి 1,2,3,4-**కళత్రముతో విరోధమేర్పడకుండా జాగ్రత్తపడుట మంచిది. కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగా నుండవు. సహనం వహించుట అన్ని విధాలా మేలు. చివరలో సుఖము ఏర్పడుతుంది.

**కృత్తిక 1-** కుటుంబ కలహాలకు అవకాశముంటుంది. జాగ్రత్తగా నుండుట మేలు. ప్రయాణాల్లో అప్రమత్తత అవసరం. ఋణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఇతరుల సహాయ సహకారాలు ఆలస్యంగా లభిస్తాయి.

**సలహాలు**

ఈ రాశి వారు హనుమాన్ చాలీసా పారాయణ చేయండి.
ముగ్గురు వ్యక్తులకు వారు కోరిన సహాయం చేయండి.

## వృషభ



ఆదాయం -11 వ్యయం - 14
రాజపూజ్యం-4 అవమానం-7

**100 కి 70 శాతం ఫలితం**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరము అనుకూల ఫలితములు విశేషముగా ఉన్నవి. ఆర్థిక,కుటుంబ పరిస్థితులు చక్కబడి ఆనందాన్ని పొందుతూంటారు. సోదర వర్గమునుండి సహకారము లభిస్తుంది. గృహమున శుభకార్య నిర్వహణ ద్వారా ఖర్చు అధిక మగును. సంతానము లేనివారికి ఈ సంవత్సరము పుత్ర సంతానము కలుగును. శత్రుకార్యములయందు,కోర్టు,విదేశీ వ్యవహారములు వాయిదావేసుకొనుట మేలు, లేని యెడల పరాజయము ఎదురగును. జీవిత భాగస్వామితో విరోధాలు ఏర్పడును. ఆకస్మిక విహార స్థలాలకు ప్రయాణాలు సాగించెదరు. చేయు వృత్తియందు సానుకూల పరిస్థితులు ఏర్పడి తోటివారి సహకారాన్ని పొందుతారు. నిద్రలేమి తనము వలన ఆరోగ్యభంగము వాటిల్లగలదు.

ఈ రాశి స్త్రీలకు భాగస్వామ్య వ్యవహారాలు వాయిదా వేసుకొనుట మేలుగా తోచుచున్నది.

### నక్షత్ర ఫలితాలు

**కృత్తిక 2,3,4-** గృహకార్యాలపై శ్రద్ధ వహిస్తారు. ధనలాభంతో ఆనందిస్తారు. బంధు మిత్రులతో విందులు,వినోదాల్లో పాల్గొంటారు. భక్తి శ్రద్ధలధికమవుతాయి. సమస్యలు పరిష్కరింప బడతాయి.

**రోహిణి 1,2,3,4-** అధికారులతో పరిచయాలు ఏర్పడతాయి. పట్టుదలతో కార్యాలు పూర్తిచేసి పలువురి దృష్టిని ఆకర్షిస్తారు. నూతన వ్యక్తులు పరిచయమవుతారు.

**మృగశిర 1,2-** దూరప్రాంత ప్రయాణాలు వాయిదా వేయుట మంచిది. మనస్సు చంచలంగా ఉంటుంది. చెడు సహవాసానికి దూరంగా నుండుటకు ప్రయత్నించాలి. కొత్తవ్యక్తుల జోలికి వెళ్లరాదు.

**సలహాలు**

ఈ రాశి వారు సుందర కాండ పారాయణ-హోమం చేయండి.
బాబా భక్తులకు షిరిడీ వెళ్లటానికి సహాయ పడండి.

## మిథున



ఆదాయం -14 వ్యయం -11
రాజపూజ్యం -7 అవమానం - 7

**100 కి 80 శాతం ఫలితం**

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు ఏపని ప్రారంభంచేసినా విజయ వంతముగా ముందుకు సాగును. నూతన పెట్టుబడులు వ్యాపారాలు కలసివచ్చును. కోర్టు,విదేశీ వ్యవ హారాలు అనుకూలమగును. సోదర,బంధు వర్గమునుండి సహకారము లభించును. గృహమున గతంలో ప్రయత్నిస్తూ ఉన్న శుభకార్యములు జరుగును. పుత్ర సంతానము ద్వారా చికాకు కలుగును. శత్రు కార్యములయందు పూర్తి విజయాన్ని సాధిస్తారు. జీవిత భాగస్వామి ద్వారా కలసివచ్చును. ఆకస్మిక ధన లాభము పిత్రార్జితము ఉండును. చేయు ఉద్యోగమునందు అసహాయస్థితిని పొందుతారు. శారీరకముగా శ్రద్ధను తీసుకోవలెను.

ఈ రాశి స్త్రీలకు ప్రభుత్వము నుండి సహాయము వచ్చుటచేత నూతన ప్రయత్నములు లాభించును.

### నక్షత్ర ఫలితాలు

**మృగశిర 3,4-** విదేశీయాన ప్రయత్నాలు అనుకూలిస్తాయి. సంతోషంగా కాలం గడుపుతారు. కుటుంబ పరిస్థితి సంతృప్తి కరంగా ఉంటుంది. ఇతరులచే గౌరవింపబడుదురు. మనోల్లాసాన్ని పొందుతారు. శుభవర్తమానం అందుతుంది.

**ఆరుద్ర 1,2,3,4-** ఇతరులకు ఇబ్బంది కలగకుండా పనులను చేసుకోవాల్సి వస్తుంది. వృత్తిలో ఇబ్బందుల నెదుర్కొంటారు. జాగ్రత్త అవసరం. ధైర్యసాహసాలతో పనులను సాధించుట మేలు. తల్లి దండ్రులద్వారా స్థిరాస్తులు లభిస్తాయి.

**పునర్వసు 1,2,3-** వస్తు,వస్త్ర ఆభరణాలను పొందుతారు. మంచి ప్రవర్తనతో ఇతరులకు ఆదర్శంగా నిలుస్తారు. విజయాన్ని సాధిస్తారు. సమస్యలు పరిష్కరించుకుంటారు. కళలందు ఆసక్తి పెరుగుతుంది.

**సలహాలు**

ఈ రాశి వారు చండీ హోమం స్వయంగా చేయండి.
వెంకన్న భక్తులకు తిరుపతి వెళ్లటానికి సహాయ పడండి.

## కర్కాటక



ఆదాయం -8 వ్యయం -11
రాజపూజ్యం-3 అవమానం-3

### 100 కి 60 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరము అనుకూల ఫలితములు కలిగి సావధానముగా ఉండును. కుటుంబ, ఆర్థిక, కోర్టు, విదేశీ వ్యవహారాలు ఇతరుల సహకారముచే పూర్తి అయ్యి లాభము చేకూరును. గృహమునందు మార్పులు చేయుటచే కార్యములు సిద్ధించును. స్త్రీ సంతానాభివృద్ధి కలుగును. జీవిత భాగస్వామికి ఆరోగ్యమునందు మార్పులు కలిగి వైద్యసేవలు పొందుతారు. ఆకస్మిక ప్రయాణాలు వలన ధనము ఖర్చుఅగును. నూతన పెట్టుబడులు వాయిదా వేసుకొనుట మంచిది. చేయు ఉద్యోగముల యందు తాము ఆశించిన ఫలితాలను పొందలేరు. శారీరకముగా సుఖాన్ని పొంది ఉల్లాసాన్ని పొందుతారు.

ఈ రాశి స్త్రీలకు శారీరకముగా శ్రమ అధికంగా ఉన్నను అనుకున్నపనులు జరుగుటవలన సంతోషాన్ని వ్యక్తంచేస్తారు.

#### నక్షత్ర ఫలితాలు

**పునర్వసు 4-** కుటుంబంలో అనారోగ్య బాధలుంటాయి. బంధు, మిత్రులతో జాగ్రత్తపడుట మంచిది. వ్యవహారంలో చికాకులను ఎదుర్కొంటారు. ప్రయత్నించే కార్యాలు విఫలమవుతాయి.

**పుష్యమి 1,2,3,4-** బంధు, మిత్రులతో కలుస్తారు. నూతన గృహనిర్మాణ ప్రయత్నం చేస్తారు. కుటుంబ సౌఖ్యముంటుంది. శత్రుబాధలు దూరమవుతాయి. సమస్యలు తొలగిపోతాయి.

**ఆశ్రేష 1,2,3,4-** కీళ్ళనొప్పులు అధికమవుతాయి. ప్రయత్న కార్యాలన్నీ సంపూర్ణంగా ఫలిస్తాయి. ధనలాభమేర్పడుతుంది. కళాత్మక వస్తువులను సేకరిస్తారు. క్రొత్త కార్యాలకు చక్కని రూపకల్పన చేస్తారు.

#### సలహాలు

ఈ రాశి వారు దత్త కవచం 21 సార్లు పారాయణ చేయండి. ప్రతీ మంగళవారం నాడు శనగలు ప్రసాదం పంచండి.

## సింహ



ఆదాయం -11 వ్యయం -5
రాజపూజ్యం 6 అవమానం-3

### 100 కి 85 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు రాజయోగవంతముగా ఉన్నది. పట్టుదలచేత పనులు సాధిస్తారు. నూతన గృహనిర్మాణములు చేపట్టుతారు. సంఘమున గౌరవ మర్యాదలు పొందుతారు. కోర్టువ్యవహారాలు విదేశీయానము విజయవంతంగా సాగును. కుటుంబ, ధనవిష యాలలో ప్రత్యేకతను సాధిస్తారు. బంధువర్గము నుండి వ్యతిరేకత వుండును. పుత్ర సంతానము వలన పేరు ప్రఖ్యాతలు వచ్చును. శత్రువులను జయించి ఆనందాన్ని పొందుతారు. జీవితభాగస్వామికి అనారోగ్యముగాఉండి ధనము ఖర్చు అగును. ఆకస్మిక పుణ్యక్షేత్ర సందర్శనము చేస్తారు. పూర్వ పిత్రార్జితము కలసి వస్తుంది. చేయు వృత్తియందు అధికారుల ఆగ్రహమున్నను తోటివారి సహాయముతో పనులు పూర్తిచేస్తారు. శారీరకముగా ఉల్లాసాన్నిపొంది సుఖనిద్ర పొందుతారు. ఈ రాశి స్త్రీలకు రాజకీయరంగ ప్రవేశము, భారీ పరిశ్రమలు నెలకొల్పుటకు అవకాశమున్నది.

#### నక్షత్ర ఫలితాలు

**మఖ 1,2,3,4-**విదేశీయాన ప్రయత్నాలకు అనుకూలంగా ఉంటుంది. స్థానచలన మేర్పడే సూచనలుంటాయి. ఉదరవ్యాధితో బాధపడేవారు జాగ్రత్తగా నుండాలి. సత్కార్యాల్లో పాల్గొంటారు. గృహ అవసరాలకు ప్రాధాన్యమిస్తారు.

**పుబ్బ 1,2,3,4** -ప్రయత్న కార్యాలకు ఆటంకాలెదురవుతాయి. స్త్రీల మూలకంగా ధనప్రాప్తి కలుగుతుంది. పిల్లల పట్ల పట్టుదల పనికిరాదు. వృత్తి, ఉద్యోగ రంగంలోనివారికి ఆటంకాలున్ననూ పూర్తవుతాయి. ఆరోగ్యం గూర్చి శ్రద్ధ అవసరం.

**ఉత్తర 1-** నూతన వస్తు, ఆభరణాలను కొనుగోలు చేస్తారు. మంచి ఆలోచనలను కలిగి వుంటారు. బంధు, మిత్రులు గౌరవిస్తారు. శుభకార్యప్రయత్నాలు సులభంగా నెరవేర్చుతారు. శుభవార్తలు వింటారు.

#### సలహాలు

ఈ రాశి వారు సంపూర్ణ వాస్తు పూజ - హోమం చేయండి. దగ్గరలోని దేవాలయ దర్శనం చేస్తూండండి.

## కన్య



ఆదాయం -14 వ్యయం -11
రాజపూజ్యం-2 అవమానం-6

### 100 కి 80 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరము సువర్ణ వంతముగా ఉన్నది. నూతన కార్యములు పెట్టుబడులు లాభించును. ధనమును తమచేతులతోనే ఖర్చు పెట్టవలెను. సోదర సహకారములు సామాన్యముగా ఉన్నను చివరికి పూర్తి అగును. గృహమునందు శుభకార్యములు చేయుదురు. పుత్రికా సంతానముద్వారా కుటుంబమున అభివృద్ధి గానుండును. కోర్టు, విదేశీ వ్యవహారాలు త్వరితగతిన పూర్తిఅగును. భార్యకు అనారోగ్యముగా ఉండును. ఆకస్మిక ప్రయాణాలవలన ధనాదాయము ఉండదు. పూర్వములో నిలచిన ఆస్థివిషయాలు కొలిక్కివచ్చును. నూతన ప్రయత్నములచే లాభములు కలిగి సుఖాన్ని పొందెదరు.

ఈ రాశి స్త్రీలకు పెట్టుబడులుద్వారా లాభాలను ఆర్జించి మరింతగా బలపబతారు.

#### నక్షత్ర ఫలితాలు

**ఉత్తర 2,3,4-**ఆరోగ్యం విషయంలో జాగ్రత్తపడుట మంచిది. ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. దూరప్రాంత ప్రయాణాలకు మార్గం సుగమమవుతుంది. కుటుంబంలో సుఖ, సంతోషాలు లభిస్తాయి. ధనధాన్యాభివృద్ధి ఉంటుంది.

**హస్త 1,2,3,4-**ప్రయత్న కార్యాలకు ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయాణాలవల్ల అలసట పెరుగుతుంది. గృహంలో జరిగే వాస్తు మార్పులు సంతృప్తినిస్తాయి. లాభదాయకంగా ఉంటుంది.

**చిత్త 1,2,-** తొందరపాటు తనంవల్ల కార్యాలు చెడిపోతాయి. కీడు చేసేవారికి దూరంగా నుండుట మంచిది. శారీరకంగా బలహీనమేర్పడుతుంది. వ్యవసాయ రంగంలోనివారికి లాభదాయకంగా ఉంటుంది. ప్రయాణాల్లో వ్యయ, ప్రయాసలు ఎక్కువగా ఉంటాయి.

#### సలహాలు

ఈ రాశి వారు శివ సహస్రం పారాయణ చేయండి. తెలుసున్నవారిని శ్రీశైలం మీ ఖర్చుతో పంపండి.

## తుల 

ఆదాయం -11 వ్యయం -14
రాజపూజ్యం -5 అవమానం -6

### 100 కి 35 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరము గడ్డుకాలముగా జరుగుచున్నది. ఏపని చేసినా కలసిరాక ధననష్టము కలుగుచుండును. అప్పులు చేయవలసి వచ్చును. సోదరుల నుండి సహకారము ఉండును. గృహసంబంధ కార్యములు అప్పుచేసి నిదానముగా పూర్తి చేస్తారు. పుత్రసంతానముద్వారా సంతోషాన్ని పొందుతారు. కోర్టు వ్యవహారాలు, విదేశీ వ్యాపకాలు వాయిదా వేసుకొనుట మేలు. ఆధ్యాత్మికంగా గడుపుచుండుట మేలు. జీవిత భాగస్వామికి అనారోగ్యము. భాగస్వామ్య లావాదేవీలలో ఇతరుల సహకారము పొందుట మేలు. పిత్రార్జితము సంవత్సరాంతమున చేతికివచ్చును. చేయువృత్తియందు ప్రోత్సాహము ఉంటుంది. క్రయవిక్రయాలలో మాత్రము ప్రగతిని సాధిస్తారు. సుఖనిద్రతో ఆరోగ్యాన్ని పొందుతారు.

ఈ రాశి స్త్రీలకు నూతనముగా కార్యక్రమములు చేపట్టి ప్రజలను ఆకర్షించెదరు.

#### నక్షత్ర ఫలితాలు

**చిత్త 3,4**-అనవసరమైన భయాందోళనలు అధికమవుతాయి. ప్రయాణాలు జాగ్రత్తగా చేయుటమంచిది. ఆర్థిక స్థితిలో మార్పు లుంటాయి. ఋణప్రయత్నాలు చేస్తారు. ఆత్మీయుల సహకారం లభిస్తుంది. విదేశయాన ప్రయత్నాలు ఫలిస్తాయి.

**స్వాతి 1,2,3,4**- కుటుంబంలో అనుకోకుండా కలహాలేర్పడే అవకాశముంటుంది. అనారోగ్య బాధలు అధికమవుతాయి. ఆకస్మిక ధననష్టం ఉంటుంది. జాగ్రత్త వహించుట మంచిది. రాజకీయ వ్యవహారాల్లో దిగ్విజయాన్ని పొందుతారు.

**విశాఖ 1,2,3**- ప్రయత్న కార్యాలన్నీ సంపూర్ణంగా ఫలిస్తాయి. ఆరోగ్యవంతులుగా ఉంటారు. ఇతరులకు ఉపకరించు పనులు చేపడతారు. పితృవర్గంవారికి కర్మచేసే అవకాశము. గృహప్రయత్నాలు ఫలిస్తాయి.

#### సలహాలు

ఈ రాశి వారు సుందరకాండ లోని 52 వ సర్గ రోజూ పారాయణ చేయండి. తేనె తమలపాకులు నివేదించి పంచండి.

## వృశ్చిక 

ఆదాయం -2 వ్యయం -8
రాజపూజ్యం -1 అవమానం -2

### 100 కి 65 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు సామాన్య యోగముచే పెట్టు బడులుపెట్టివిశేషమైన, ఆశ్చర్యమైన ధనాదాయాన్ని పొందుతారు. కుటుంబ, ఆర్థిక వ్యవహారాలు లాభాన్ని కలిగిస్తాయి. సోదరులనుండి, బంధువర్గమునుండి సహకారము అంది శుభకార్యాలు చేస్తారు. సంతానముద్వారా, శత్రువుల ద్వారా చికాకులు కలుగుటకు అవకాశమున్నది. భాగస్వామ్య విషయాలలో సొంతనిర్ణయాలు తీసుకొనుట మేలుగా నుండును. ఆకస్మిక ధనలాభ మున్నది. నూతన కార్యములు, పిత్రార్జితము నిదానముగా పూర్తిఅగును. కోర్టు, విదేశీవ్యవహారాలు బలప డతాయి. చేయువృత్తి, ఉద్యోగమునందు మంచి మార్పులు జరిగి సంతోషాన్ని పొందుతారు. నిద్రలో చెడుకలలు వచ్చుటద్వారా భయానికి గురి అగుదురు. యజ్ఞయాగాది క్రతువులందు పాల్గొనెదరు.

ఈ రాశి స్త్రీలకు ప్రతీ విషయమును ఆలోచనచేత ఆచరణచేత సరైననిర్ణయాలు తీసుకొని జీవనము సాగించుట మేలు.

#### నక్షత్ర ఫలితాలు

**విశాఖ 4**- కుటుంబ సౌఖ్యం లభిస్తుంది. ఋణబాధలు తొల గిపోతాయి. ధైర్య సాహ సాలతో విజయాన్ని పొందుతారు. బంధువులతో జాగ్రత్తగా మెలగుట మంచిది. మంచి ఆరోగ్యము ఏర్పడుతుంది.

**అనూరాధ 1,2,3,4**-సంతోషంగా కాలం గడుపుతారు. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఇతరులచే గౌరవింప బడుదురు. ఆర్థిక చింత ఉండదు. శుభవర్తమానం వస్తుంది. అనుకోకుండా కుటుంబంలో మంచి మార్పులు ఏర్పడతాయి.

**జ్యేష్ఠ 1,2,3,4**- జీవిత భాగస్వామికి అనారోగ్యము. కంప్యూటర్ రంగాలవారికి మంచి అవకాశాలు ఏర్పడతాయి. నూతన వస్తు, ఆభరణాలు కొనుగోలుచేస్తారు. దూరప్రాంత ప్రయాణాలు కలిసివస్తాయి.

#### సలహాలు

ఈ రాశి వారు ప్రతీ మంగళవారం 108 సార్లు హనుమాన్ చాలీసా చదవండి. 5 అరటిపండ్లు బాలుడికి ఇవ్వండి

## ధనుస్సు 

ఆదాయం -5 వ్యయం -14
రాజపూజ్యం -4 అవమానం -2

### 100 కి 80 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు విశేష యోగములచేత, బంధు జన సహకారములచేత కార్యములను చేపట్టి లాభాలను పొందుతారు. కుటుంబ, ఆర్థిక, కోర్టు, విదేశీ వ్యవహారాలు సత్వరపరిష్కారానికి వచ్చి మేలుకలుగును. గృహమున గొడ వలచేత మానసిక క్షోభను అనుభవించ వలసి వచ్చును. జీవిత భాగస్వామి సహాయంతో తమ వృత్తివ్యాపారము లను సాగించుట ద్వారా ఉత్తమ ఫలితాలను పొందుతారు. పుత్ర సంతానము ద్వారా ఆర్థిక నష్టము వాటిల్లును. గతంలో రావలసిన బాకీలు ఈ సంవత్సరమున వసూలగును. చేయుఉద్యోగము నం దు అధికారుల మన్ననలను పొందిననూ తోటివారివలన యిబ్బందులు ఎదుర్కొందురు.

ఈ రాశి స్త్రీలకు క్రొత్త పనులు చేపట్టుటవలన ధననష్ట మున్నది కావున జాగ్ర త్త వహించవలెను.

#### నక్షత్ర ఫలితాలు

**మూల 1,2,3,4**-బంధు, మిత్రులను కలుస్తారు. నూతన గృహ నిర్మాణ ప్రయత్నం చేస్తా రు. శత్రుబాధలు దూరమవుతాయి. సమస్యలు పరిష్కారమవుతాయి. ప్రయత్న కార్యాలు సిద్ధిస్తాయి. కోర్టు వ్యవహారాలు సానుకూలపడతాయి.

**పూర్వాషాఢ 1,2,3,4**-ప్రయాణాల్లో జాగ్రత్త అవసరం. నూతన కార్యాలు ప్రారంభము చేయుట మంచిది. జీవిత భాగస్వామిద్వారా ధనలాభమేర్పడుతుంది. విందులు, వినోదాల్లో పాల్గొంటారు. కళాత్మక వస్తువులను సేకరిస్తారు.

**ఉత్తరాషాఢ 1**- క్రొత్త కార్యాలకు రూపకల్పన చేస్తారు. ఉన్నత వ్యక్తులను కలుస్తారు. ధనలాభయోగముంటుంది. ముఖ్యమైన సమాచారము వలన ఆనందానుభూతులను పొందుతారు. వస్తు, ఆభరణాలను కొనుగోలు చేస్తారు.

#### సలహాలు

ఈ రాశి వారు గరిక - తేనెతో వినాయక హోమం చేయండి. పేద విద్యార్థికి ఫీజు కట్టండి

## మకర 

ఆదాయం -8 వ్యయం -8
రాజపూజ్యం-7 అవమానం-2

### 100 కి 50 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరము సామాన్యముగా ఉన్న ది. ఆర్థిక లావాదేవీలు, కోర్టు,విదేశీ వ్యవహారములు కొలిక్కి వచ్చినను సంతోషముండదు. కుటుంబమున మాత్రము గౌరవం పెరుగుతుంది. సోదరుల వలన ప్రాణాపాయస్థితి కలదు. బంధువర్గముతో జాగ్రత్తగాఉండవలెను.పుత్రికా వివాహ ము చేయుట వలన, పుణ్య కార్యములయందు పాల్గొనుటవలన దేవతాను గ్రహమును పొందుతారు.మధ్యమధ్యన ఆరోగ్యభంగమువలన ధననష్టము కలుగు చుండును. చేయు ఉద్యోగమునందు బదిలీలు జరిగి కొందరు నష్టపోవుదురు. శారీరకముగాసుఖమును పొందెదరు.

ఈ రాశి స్త్రీలకు పెట్టుబడులు లాభించుట వలన అలంకార వస్తుసామాగ్రులను కొనుగోలుచేయుదురు.

#### నక్షత్ర ఫలితాలు

**ఉత్తరాషాఢ 2,3,4-** వ్యాపారంలో విశేషలాభాన్ని ఆర్జిస్తారు. మంచి వారితో స్నేహం చేస్తారు.ముఖ్యమైన వ్యక్తులతో విదేశీ సమాచారాన్ని సేకరిస్తారు.గృహమున శుభకార్యాలు చేస్తారు.పిల్లలకు విద్యయందు మంచి అవకాశాలు లభిస్తాయి.

**శ్రవణం 1,2,3,4-**వాయిదా వేయబడిన పనులు పూర్తిచేస్తారు. ఉద్యోగంలో ఉన్నతస్థితిని కలిగిఉంటారు.కళాకారులకు మంచి అవార్డులు లభిస్తాయి. ప్రింటింగు వారికి క్రొత్త అవకాశాలు వస్తాయి. గృహమున కళ్యాణకార్యాలు జరుగును.

**ధనిష్ఠ 1,2-**పుణ్యక్షేత్రములయందు వస్తు,ఆభరణాలను కొనుగోలు చేస్తారు.శుభవార్తలు వినుటద్వారా మానసిక సంతోషానికి గురి అవుతారు. పండిత సభలలో పాల్గొంటారు. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ వహించవలసి వస్తుంది.

#### సలహాలు

ఈ రాశి వారు నమకం పారాయణ-హోమం చేయించండి. లేని ఆడబిడ్డకు వివాహం మీ ఖర్చుతో చేయండి.

## కుంభ 

ఆదాయం -8 వ్యయం -8
రాజపూజ్యం-3 అవమానం-5

### 100 కి 45 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు ఇతర కార్యములకన్నా స్వకార్య ములయందు నష్టము ఎక్కువగా ఉన్నది. సొంతయింటిని వదిలి పరాయింటిలో నివాసముండెదరు. లేనిపోని అనారోగ్యములను ఊహించుకొని బాధపడెదరు.కోర్టు, విదేశీ వ్యవహారాల్లో వాయిదావేసుకొనుట మేలు.కుటుంబమున సంఘమున గౌరవాన్ని కోల్పో దురు. సొంతనిర్ణయాలు తీసుకోకుండా ఇతరులద్వారా నిర్ణయాలు తీసుకొని లాభాన్ని పొందుటకు కృషిచేయవలెను.జీవిత భాగస్వామి ఒక్కరే మిమ్మల్ని కాపాడగలదు. పుత్రసంతా నమ లేనివారికి ఈసంవత్సరమున కలుగును. విపరీతబద్ధకముచేత కార్యములను వాయిదా వేయకుండా ఎప్పటికప్పుడు పనులుచేసుకొనుట మంచిది.చేయవృత్తియందు సానుకూలముగానున్నది.

ఈ రాశి స్త్రీలకు సుఖవంతమైన కాలము.

#### నక్షత్ర ఫలితాలు

**ధనిష్ఠ 3,4-**కుటుంబ పరిస్థితుల సంతృప్తికరంగా ఉంటాయి. సమాజంలో మంచి పేరు సంపాదిస్తారు. ఇతరులు మిమ్మల్ని ఆదర్శంగా తీసుకొనుటకు కృషిచేస్తారు.అకారణంగా కలహాలేర్పడే అవకాశాలుంటాయి.అనవసర భయానికి లోనవుతారు.

**శతభిషం1,2,3,4-**వ్యాపార రంగంలోనివారు జాగ్రత్తగా నుండుట మంచిది. పిల్లలపట్ల మిక్కిలి మిక్కిలి ధైర్య, సాహసాలు కలిగియుంటారు. సూక్ష్మబుద్ధితో విజయాన్ని సాధిస్తారు. పరాక్రమాన్ని ఇతరులు గుర్తిస్తారు. మనోల్లాసాన్ని కలిగివుంటారు.

**పూర్వాభాద్ర 1,2,3-**శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెర వేర్చుకుంటారు. ముఖ్యమైన వ్యక్తుల్ని కలుస్తారు. ఆర్థిక ఇబ్బందు లతో సతమతమవుతారు. ప్రయాణాలు జాగ్రత్తగా చేయుట మంచిది. అజీర్ణబాధలు అధికమవుతాయి,రక్షించుకోవడం అవసరం.

#### సలహాలు

ఈ రాశి వారు సుందర కాండ పారాయణ-హోమం చేయండి. శివాలయంలో ఇతరులతో కలిసి శుభ్రం చేయండి.

## మీన 

ఆదాయం -5 వ్యయం -14
రాజపూజ్యం-6 అవమానం -5

### 100 కి 55 శాతం ఫలితం

గ్రహగతులను పరిశీలించగా ఈ సంవత్సరమంతయు మిశ్రమ ఫలితముగా నున్నది. గృహమున శాంతిగాఉండును. కుటుంబమునందు వ్యక్తులతో జాగ్రత్తగామెలగవలెను. పిల్లలకు కలిసి వచ్చును. శత్రుకార్యములందు విజయము సాధింతురు. ఈసంవత్సరమంతయు విశేషానారోగ్యముచే బాధపడుచుండవలెను. చేయు వృత్తి యందు ప్రజ్ఞను కనబరచి నూతన ఆదాయములను పొందుతారు. ఆస్తిలావాదేవీలు,కోర్టువ్యవహారాలు మీవంతుగా వాయిదావేసుకొనుట మంచిది. విదేశీ యానమున్నందున ధనమును ఖర్చు పెట్టవలెను. నూతన వస్తు సామాగ్రులను గృహమున అమర్చెదరు.

ఈ రాశి స్త్రీలకు ప్రభుత్వ పథకములచేత సంఘమున తమ కృషిని చాటుకొని కీర్తి ప్రతిష్ఠలు సంపాదింతురు.

#### నక్షత్ర ఫలితాలు

**పూర్వాభాద్ర 4-** బంధు,మిత్ర విరోధమేర్పడకుండా జాగ్రత్త వహించుట మంచిది. మానసికాందోళన అధికమగును. అనవసర నిందలతో అపకీర్తి వస్తుంది. స్థిరమైన నిర్ణయాలు తీసుకోలేరు.కుటుంబ సౌఖ్యం సంపూర్ణంగా లభిస్తుంది.

**ఉత్తరాభాద్ర 1,2,3,4-** ఆకస్మిక ధనలాభంతో ఆనందాన్ని పొందుతారు.అపకారం చేసే కార్యాల్లో నిమగ్నులవుతారు.ఉద్యోగ రంగాల్లోఊహించని పేరు, ప్రతిష్ఠలు లభిస్తాయి.మంచి అవకాశము లున్ననూ జాగ్రత్త అవసరం.

**రేవతి 1,2,3,4-** శుభకార్య ప్రయత్నాలు సులభంగా నెరవేరతాయి. అద్భుతమైన అవకాశాలను పొందుతారు.ముఖ్యమైన శుభవార్తలు వింటారు. నూతనవస్తు, ఆభరణాలు కొనుగోలు చేస్తారు.రాజకీయ రంగంలోనివారికి అద్భుతమైన అవకాశాలు లభిస్తాయి. అన్నింటా విజయాన్నే సాధిస్తారు.

#### సలహాలు

ఈ రాశి వారు విష్ణు సహస్రం హోమం స్వయంగా చేయండి. విష్ణు భక్తులకు వస్త్ర దానం చేయండి.

